# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర పుష్య శు॥ ౫

గురువారము


## అఖిల హిందూమహాసభ

అఖిలభారత హిందూమహాసభ యీ తడవ (దక్షిణ) మధురానగరములో జరిగినది. మధురానగర మొకనాడు దక్షిణహిందూదేశమందు హిందువులసంస్కృతికిని, విద్యకును ప్రధాన కేంద్రముగా నుండెను. ఆ కేంద్రములోని పండిత పీఠాన్ని మెప్పించనేరని వారికి ఏరాజాస్థానమందును గౌరవములేకుండెడిది. వేగవతీ నదీతీరమందుండు ఈమధురలో ఆంధ్రులు మూడునూర్ల యేండ్లవరకు అవక్రపరాక్రమముతో రాజ్యము చేసినది చరిత్రప్రసిద్ధము. కావున ఈమధురానగరము ద్రావిడశాఖకుచేరిన వారందరికేగాక యావదార్య జగత్తునకంతకును అనేక కారణాలనుబట్టి పవిత్రమైనట్టి స్థలము. అచ్చటజరిగిన అఖిలభారత హిందూమహాసభకు మూడవమారు జగద్విఖ్యాతులైన వినాయక దామోదర సావర్కరుగారు అధ్యక్షులుగా ఏర్పడి అఖండవిజయముతో సభను జరిపిరనువార్తలను పత్రికలలో చదువగల్గితిమి. వినాయకసావర్కరుగారి అభిప్రాయములతో అందరును ఏకీభవించజాలరు. భిన్న భిన్న సంఘాలకు భిన్నభిన్నాదర్శాలుండును. నాయకులలో దేశసేవావిధానమందు విభిన్నవిధానాలుండును. పరాధీనముననుండు దేశాలలో బహునాయకత్వముండుట, వాటికేకారణము చేతనైతేనేమి నిత్యాభివృద్ధిగా దోహదము జరుగుచుండుట మన అనుభవములోని విషయమే.

ముస్లింలీగు ఉండినప్పుడు హిందూమహాసభ ఏర్పడుట సహజమే. ఒకరు పాకిస్థాన్ అంటే ఇంకొకరు హిందూస్థాన్ అంటున్నారు. ఒకరు మామతమునకు ప్రత్యేకరక్షణము కావలెనంటే ఇంకొకరును అదేమాట అంటున్నారు. ఒకరు మాకు మా సంఖ్యకన్న మించిన అధికారాలు, స్థానాలు, ఉద్యోగాలు అన్నీ కావలెనంటే ఇంకొకరు అట్లుపీలు లేదంటారు. మా మతము అపాయములో ఉన్నదంటే ఇంకొకరును అదేమాట అంటున్నారు. అయితే యీ తుదివిషయములోమాత్రము హిందువుల మొరకు ఆధారమున్నది. హిందువులలో ఎంతవరకు "సనాతన" శాఖ ఉండునో అంతవరకు పరమత [illegible] వారికి మంచిబలముండుననుటలో సందేహములేదు. పరస్పరాసహనము, సంఘక్రౌర్యము, నీచోచ్చత్వములను తప్పుడు సిద్ధాంతాలు, అంటుముట్టుపట్టింపు, జన్మముచేతనే దేవత్వాదిస్వత్వ సంపాదనవాదములు, మరియిట్టి సిద్ధాంతములను సనాతన బ్రువులెంతవరకు వాదించుచుందురో అంతవరకు హిందూమతమును జనులు బహుళముగా వీడి అన్యమతాలలో కలిసిపోవుటకు మంచి సదుపాయాలు ఏర్పడియుండుటలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

సావర్కరుగారు తమ ఉపన్యాసములో కొన్ని అభిప్రాయాలను ప్రకటించిరి. అందుచాలా భావాలు విపరీతప్రజ్ఞావిర్భావములుగా కనబడుచున్నవి. ముస్లింలు తమ ఇస్లామీసంస్థానాలపై పంచప్రాణాలు అప్పజెప్పుచున్నారుకదా! మరి హిందువులు తమ హిందూ సంస్థానాలపై ఎందుకు అభిమానము వహించరు—అని సావర్కరుగారి ప్రశ్న. ఇదిముందు భారతదేశములో ఏర్పడనున్న అవాంతరాలలో ప్రప్రథమసమస్య గాబోవునట్లున్నది.

హిందూమహాసభకున్ను కాంగ్రెసుతోను ముస్లింలీగుతోను సమానమైన స్థానము బ్రిటిషుప్రభుత్వమువారి దృష్టిలో ఏర్పడినదని సావర్కరుగారు సెలవిచ్చినారు. ఇదినిజమే. ఇంకా సిక్కులు, హరిజనులు, క్రైస్తవులువిజృంభించలేదు. ఈకొరత ఒక్కటే మిగిలియున్నది. ఇవన్నియు లీగుమహాసభల ధోరణిలోనికి దిగిననాడు ఈ భారతదేశము వైకుంఠముగా ప్రత్యేక "జన్నత్"గా నుండునేమో?

సావర్కరు చెప్పిన ఒకవిషయముతో [కారణము భిన్నమైనను] మేమేకీభవించుచున్నాము. అదేమనగా ఇంగ్లీషువారికి యుద్ధములో భారతీయులందరును సాయపడవలెను. మన సహాయమంతగా పనికివచ్చేది కాకపోవచ్చును. ఈ యూరోపు యుద్ధములో మన ఇంగ్లీషువారికి దినానికి ౨౦ కోట్ల రూపాయీలకుపైగా ఖర్చగుచుండగా దరిద్రనారాయణుని కునికిపట్టైన యీ భారతదేశమేమి సహాయముచేయగలదు. "పత్రంపుష్పం ఫలం తోయం" అన్నట్లుగా మనమున్నా మనవిధిని నెరవేర్చుకొందము. ఇంగ్లీషువారు సావర్కరుగారన్నట్లుగా జర్మనుల మొత్తిడికి బెదరలేదు. వారో పిరికిజాతి కాదు. కావున "జర్మనులువస్తే మీగతియేమౌతుందో చూచుకోండి" అను బిభీషికలకు మనము భయపడవలసినది లేదు. అగతి మనకురాదు. మనకున్న గతిలో ఏయిమార్పులగునో అది ఇంగ్లీషువారి అనుగ్రహాధీనము.

సావర్కరుగారు అహింసపైన గొప్ప దెబ్బతీసినారు. ఈచర్చ ఉభయవిధాలా సారము కలిగినట్టిదే. ఆలోతుపాతులలోనికిప్పుడు మేము దిగదలచుకొనలేదు.

## దొంగతనము

ఇంతవఱకు దొంగ దొఱకలేదు

(స్వ. వి) వేముల జహీరు [illegible]

ఈగ్రామమును వాదాలకు సమీపమున కల్వకుర్తి తాలూకలో చేయున్నది, ఇచ్చట కుర్వ బాల [illegible] వరాలను నాతడు నివసించుచు— [illegible] ముందు వీరియింటిలో (౭౦) తులముల [illegible] కొనిగిరిం పబడినది, అన్నియు అభరణములే, పోలీసువారికి రిపోర్టుయిచ్చుటచే యిల్లాలు అమీను [illegible] [illegible] జిల్లామహాబూబునగరు మొదట విచారణ [illegible] వారిని [illegible] అనుకొందరిని పోలీసువారు [illegible] రణచేసికొని జాడతెలియలేదు, [illegible] నుండి విడుదలచేసినారట, కానిఇంతవరకు దొంగిలి చిన నారకరో బయటపడలేదు.

## జోగిపేట ఆర్యసమాజము

జోగిపేట ఆర్యసమాజము స్థాపించినదాది శ్రీ పండితు జయదేవసిద్ధాంతరత్న గారు హిందీవిద్యవిషయమై చాలపట్టుదలతో పనిచేయుచున్నారు, రాత్రులందు సుమారు ఇరువైఎనిమిది యువకులు హిందీ నభ్యసించుచున్నారు. ఇక్కడ ౨౫_౧_౨_౪౦ రోజున బజారులో ఒకదుకాణములో శ్రీ బీ. మాణిక్యం గారిఅధ్యక్షతనసభజరిగెను. అందులో సుమారు ఒకవంద యాభై మందియువకులు వృద్ధులు పాల్గొనియుండిరి_ శ్రీ బాలశెట్టివిశ్వనాథంగుప్త (సదాశివపేట)గారు ఆర్యసమాజమన నేమియో వివరించి తెల్పిరి_ శ్రీనారాయణరెడ్డి ఆర్య చౌట్పల్లిగారు ఐక్యతనుగురించి తెల్పిరి— శ్రీమాన్ పండితు జయదేవు సిద్ధాంతరత్న గారు వర్ణాశ్రమ ధర్మమును గురించి తెల్పిరి—తరువాత అధ్యక్షమహాశయుని ఉపన్యాసముతో సభముగిసెను—మరునాడు_౨౬_౧_౨_౪౦ గురువారముసాయంత్రము సుమారుఎనిమిదిగంటలకు ఆర్యసమాజమందిరమున శ్రీ ముదల్ కర్ గోవిందరావుగారి అధ్యక్షతతో సత్సంగసమావేశముజరిగెను— అందులోకూడ యాభైమంది దయచేసియుండిరి— శ్రీమాన్ పండిత జయదేవు సిద్ధాంతరత్న గారు ధర్మమును ఘనముగా కైగొలుపోవుట వలదని స్పష్టముగ దెల్పిరి— శ్రీనారాయణరెడ్డి ఆర్యగారు వర్ణములు ఆశ్రమములను గురించి తెల్పిరి_ తరువాత అధ్యక్షుని ఉపసంహార ఉపన్యాసముతో సభ ముగింపబడెను_

## ఆంధ్ర పఠనాలయస్థాపన

౨౧-౩_౧౩౫౦ నాడు కల్వకుర్తి తాలూకాలోనిదగు ఈగ్రామమునకు బాగాయతు తాలూకా ఆంధ్రజనసంఘప్రచారకులగు శ్రీయుత శ్రీనివాసరావు రామారిగారు విచ్చేసి ఆంధ్రమహాసభాముఖ్యోద్దేశములు, ఆదిరైతులకైపలువుచున్నకృషివిపులముగాబోధించిరి, తనుపరి వారి ఆదేశానుసారము ఇచ్చటఒక పఠనాలయము "చర్మాకరు ఆంధ్రపఠనాలయము" అనుపేర స్థాపించబడెను. అప్పటికప్పుడే ఈక్రిందికార్యనిర్వాహకసభ్యుల ఎన్నికలుకూడ ఈక్రిందివిధముగ జరిగెను.

శ్రీయుత పాగులపల్లి రంగారావుగారు మక్తేదారు అధ్యక్షులు.

,, గోల నారాయణరెడ్డిగారు ఉపాధ్యక్షులు

,, గోల హన్మంతరెడ్డిగారు సం కార్యదర్శి.

,, మెండెగుత్తుల బుచ్చప్పగారు కోశాధిపతి,

మరియు ౭ గురు కార్యనిర్వాహక సభ్యులుకూడఎన్నుకొనబడిరి.

## బాలికల ఉన్నతపాఠశాల

(నారాయణగూడెము)

ఈక్రింది విద్యార్థినులు బొంబాయి గవర్నమెంటువారి డ్రాయింగు పరీక్షలో ఉత్తీర్ణులైనారు—

ఇంటర్మీడియేటు గ్రేడు

౧ ఎం.సి. రాజామణి (డాక్టరు దామోదరము నాయుడుగారి కుమార్తె)

ఎలిమెంటరీ

౧. కొండాసుమిత్ర (కొండా వేంకటరంగారెడ్డిగారి కుమార్తె)

౨. అక్కిరెడ్డి సుజాత (బొజ్జంనరసింలుగారి కుమార్తె)

౩. ఎం.సి. మణి
౪. ఎం.సి. సత్యవతి. } (డాక్టరు దామోదరము నాయుడుగారి కుమార్తెలు)

హైదరాబాదు—మునిసిపల్_ కార్పొరేషన్—గౌరవసభ్యులైన శ్రీయుతులు ప్రేమ్ జీలాల్జీగారు సుమారు రూ౧౫౦లు వెలగల ఇనుపఉయ్యాలను ఈపాఠశాలకు దానమొసగిరి,

వ్యాకరణశిరోమణి రంగాచార్యులవారిఅధ్యక్షతన_ ఈపాఠశాలాభవనమున గీతాజయంత్యుత్సవము జరుపబడెను. అధ్యక్షుని తొలిపలుకుల కొరకే బాలికలు మృదుమధురగానముతో సభ్యులనానందింపజేసిరి, అంత, శ్రీయుతులు పండిత నటరాజశర్మ గారు గీతా ప్రాముఖ్యతను గూర్చి యుపన్యసించిరి

సార్వభౌముని జన్మదినోత్సవం

హైదరాబాదు (దక్కన్).బహిమను ౨౫ ౧౯౪౧ బాను ౧౨వతేదిన సార్వభౌముని (కొటియన్ జాహి గారి) జన్మదినోత్సవమగుటచే అనాడు ప్రభుత్వకార్యాలయములకు సెలవు వగల ను గానిసెలవుకి వాతుజరుగదు.

## సుంకముల మార్పులు

హైదరాబాదు (దక్కన్), బహిమను ౨౫ ప్రభుత్వ ప్రకటనశాఖనుండి యిట్లు తెలియవచ్చినది:—

సరకులధరలు మారుటవల్ల ఎగుమతి దిగుమతుల పై సుంకములను యీక్రిందివిధముగా మార్పుచేయడమైనది.

| | పల్లా ౧కి -రు- | అ_ | పై |
|---|---|---|---|
| వేరుశనగ గింజలకు | ౦ ౧_౨ | ౦ఈ బదులు | ౦ ౧౦ |
| వేరుశనగకాయలకు | ౦ ౧౦ | ౦ఈ ,, | ౦_౯ |
| ఆముదపుగింజలకు | ౧ ౪ | ౦ఈ ,, | ౦_౧౩ |

ఈపైవాటి సుంకముల అమలు

౨౬ బగామను ౧౩౫౦ ఫ॥ నుండి జరుపబడినది—

| | పల్లా ౧కి | రు-అ_ | పై_ |
|---|---|---|---|
| దొడ్డుబియ్యమునకు | ౯—౦ఈ బదులు | ౦ | ౧_౨ |
| వర్ణమునకు, నూకలకు | ౪_౬కు ,, | ౦ | ౬_ |

వీటితనులు మాత్రము ౧౦ యిస్ఫందారు ౧౩౫౦ ఫ_ నుండి జరుపబడును—

ప్రధానమంత్రిగారికి చైనారాయబారి సందేశము

హైదరాబాదు (దక్కన్), బహిమను ౨౫ చైనాకు భారతదేశముయెడ సద్భావమున్నదని తెలియబరచుటకై కొందరు గొప్పచైనీయులు ఒకవర్గముగా టాయ్ చిటావ్ గారి నాయకత్వమున భారతదేశమునకు వచ్చిసంచారము చేసిపోయియుండిరిగదా. వారు హైదరాబాదుకుకూడవచ్చి, ఔరంగాబాదుకుపోయి అజంతా ఎల్లోరా గుహలచిత్రములనుకూడ చూచియుండిరి. ఇపుడు అటాయ్ చిటావ్ గారు రైట్ అనరబిల్ సర్ అక్బర్ హైదరీగారికి ఈక్రిందివిధంగా ఒక తంతిసందేశమును పంపియున్నారు:—

"హైదరాబాదుకున్ను అజంతాగుహలకున్ను నేనువచ్చియుండినపుడు నాకుమీరుచూపిన ఆదరమునకుకృతజ్ఞతతో వందనములనర్పించుచు స్వీకరించుటకై ప్రార్థించుచున్నాను, మీరెప్పుడుమాదేశానికివత్తురోయనియు, మీ హైదరాబాదువిద్యాపీఠము మావిద్యార్థులు కలిసిపనిచేయుట ఎప్పుడోయనియునేను ఎదురు చూచుచున్నాను."

× × ×

లండనునగరములో "అబ్జర్వర్" అనుపత్రికసంవాదకుడగు గార్విన్ గారు సర్ అక్బర్ హైదరీగారికి క్రిస్మస్ సందేశమంపినారు. అందులో హైదరాబాదునుచూచి బ్రిటిషుసామ్రాజ్యమంతయు గర్వపడుచున్నదనిచెప్పినారు. హైదరిగారు దానికిజవాబుగా ఒకతంతిని డిసంబరు ౨౮వతేదిన పంపుచు, అందులో క్రొత్తసంవత్సరంతోపాటు బ్రిటిషువారికిజయము ప్రపంచానికి శాంతి భగవంతునిదయవల్లకలుగగలవని తనకు నమ్మకమున్నదనినారు.

డిసంబరు ౨౯వతేదిన హైదరాబాదు, సికింద్రాబాదులలోని 'సనాతను'లమనుకొనువారు మధ్యాహ్నము ౨౪ గంటలకు సికిందరాబాదు సనాతనధర్మసభకార్యాలయమునుండి బయలుదేరి "సనాతనధర్మకీజెయ్" అనుకేకలతో ఊరేగి లక్ష్మీనారాయణ దేవాలయంవద్దనున్న అక్కడ పెండాలులో సభచేసిరి. బాల్యవివాహనిషేధశాసనం త్రోసివేయబడినందులకు మ_స్సా_ నిజాం ప్రభుత్వంవారికి తమకృతజ్ఞతను తెల్పుతీర్మానమామోదించిరి.

హైదరాబాదు ఉపాధ్యాయమహాసభ

హైదరాబాదు (దక్కన్), బహిమను ౨౫ అఖిల హైదరాబాదు ఉపాధ్యాయ మహాసభ వరంగల్లులో జనవరి ౧౧వ ౧౨వ తేదిలలో మ. ఘ. వ-నిజాం ప్రభుత్వ న్యాయశాఖ మంత్రియగు గౌ॥ నవ్వాబ్ అబ్దుల్ అజీజ్ గారి అధ్యక్షతలో జరుగును. వరంగల్లు నూచేవారుఅగు బ్రిజుదీన్ గారు ఆహ్వానసంఘాధ్యక్షుడుగా నియమింపబడినారు పి, వి, అర్. సెబాస్టియన్ గారు కార్యదర్శి

భారతీయ విమానదళానికి

హైదరాబాదీయులు

హైదరాబాదు, సికందరాబాదు సుహాను బాగ్ [illegible] శిక్షణపొందినతర్వాత భారతీయ వైమానికులే వారు [illegible] [illegible] ప్రదానంచబడిన పేర వారికి స్పష్టీకరముగా [illegible] డిసంబరు ౨౯వనే శిక్రిందాబాదులో యిది ఒక్క [illegible] మానదళకే.

గారు వా

ఓల్వియు

## హైదరాబాదు

## బజారు ధరలు

తేది ౨౯—౩_౫౦ ఫ॥

పల్లా ౧కి ౧౨౦ సీసతూకము. ధరలన్నీ హాలీతే.

| బియ్యము | పల్లా ౧కి ధర | | |
|---|---|---|---|
| | రూ | అ | పై |
| కిచిడీసాంబర్లు | ౨_౨ | ౦ | ౦ |
| సంబర్లు | ౨_౨ | ౦ | ౦ |
| ఢిల్లీసాంబర్లు | ౨౧ | ౦ | ౦ |
| రాం సాగర్లు | బజారులోలేవు | | |
| నాణ్ కొం | ౧౬ | ౦ ౦ | నుంచి |
| | ౨౧ | ౦ | ౦ వరకు |
| (కొత్త పాత భేదాన్ని బట్టి) | | | |
| ఆర్కాటి | ౨౦ | ౦ | ౦ |
| కోనామణి | ౨౦ | ౦ | ౦ |
| బుడుములు | ౧౪ | ౮ | ౦ |
| దేశావళి | ౧౫ | ౮ | ౦ |
| గోధుమలు | ౧౭ | ౦ | ౦ |
| బన్సీ | ౧౩ | ౦ | ౦ |
| అమ్మరీ | ౧౩ | ౦ | ౦ |
| పోటీయో | ౧౬ | ౦ | ౦ |
| ఎర్రగోధుములు | ౧_౨ | ౫ | ౦ |
| జొన్నలు | ౯ | ౪ | ౧ |
| తెల్లజొన్నలు | ౯ | ౮ | ౦ |
| పచ్చజొన్నలు | ౭ | ౪ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౭ | ౮ | ౦ |
| సెనగలు | ౧౧ | ౮ | ౦ |
| కందులు | ౮ | ౦ | ౦ |
| మినుములు | ౧౦ | ౮ | ౦ |
| అలసం | ౧౨ | ౦ | ౦ |
| సజ్జలు | ౭ | ౮ | ౦ |
| కొఱ్ఱలు | ౭ | ౪ | ౦ |
| పప్పు | | | |
| సెనగపప్పు | ౧౫ | ౮ | ౦ |
| కంది ,, | ౧౬ | ౦ | ౦ |
| సిరిసెనగ ,, | ౧౯ | ౦ | ౦ |
| అలసం ,, | ౧౩ | ౮ | ౦ |
| మినుప ,, | ౧౮ | ౦ | ౦ |
| పెసర ,, | ౧౮ | ౮ | ౦ |
| బెల్లము | ౯ | ౮ | ౦ |
| ఉప్పు | ౧_౨ | ౦ | ౦ |
| ఉల్లిగడ్డ | ౯ | ౮ | ౦ |
| తెల్లచెరుకు | ౧_౨ నుంచి | ౨౧ వరకు | |
| చక్కెర [illegible] (౪౦ సే) | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ |
| నిజామాబాదు,, ,, | ౧౩ | ౧_౨ | ౦ |
| మిశ్రచక్కెర ,, పల్ల | ౧౬ | ౨ | ౦ |
| కర్రచక్కెర..(౪౦ సే) | ౧౬ | ౧_౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧_౨ సే | ౫ | ౪ | ౦ |
| అల్లం ,, ,, | ౧ | ౧_౨ | ౦ |
| మణుగు ౧_౨ సే | | | |
| కొబ్బరినూనె | ౪ | ౮ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౮ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧_౨ | ౦ |
| వేరుశెనగనూనె ,, | ౨ | ౧౪ | ౦ |
| పుంటినూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧ కి | | | |
| నెయ్యి మణుగు ౪౦ సే | | | |
| బీదరునెయ్యి ,, ,, | ౪_౨ | ౦ | ౦ |
| తెలంగాణా ,, ,, | ౪౦ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧ కి౧౧ | ౨ | ౦ | |
| బంగారు తు ౧ కి | ౫౦ | ౪ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౬౮ | ౧_౨ | ౦ |
| తు ౧కి | ౦ | ౧౧ | ౨ |
| సవరిన్ ౧ కి కల్దారు రూ | ౨౫ | ౮ | ౦ |
| మారకం | | | |
| హాలీకి ౧ కల్దారు | ౧౫ | ౧౩ | ౦ |
| కల్దారుకు హాలీలు | ౧౫ | ౧౧ | ౦ |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ |
| వేరుసెనగ | ౮ | ౪ | ౦ |
| బుడ్డలు పల్లా ౧కి | ౮ | ౪ | ౦ |
| పప్పు పల్లా౧కి | ౧_౨ | ౦ | ౦ |

గమనిక:—

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన [illegible] పత్రికవారు బాధ్యులు కాజాలరు. ఈ. నగర [illegible] జిల్లాలలో వ్యాపారపు పేటలలోని [illegible] వర్తకులు తమదుకాణముల ప్రకటనలు మా పత్రికలో వేసికొనినవారి వ్యాపారానికి మంచి ప్రచారము కలుగును.

ఆర్. పి. గ్రో[illegible]

## రాయరావుపేట

### రైల్వేపోలీసు కానిస్టేబిలు దుర్వ్యవహారము

తేది ౨౬ డిసెంబరు ౧౯౪౦ గురువారమురోజు రాత్రి సికింద్రాబాదునుంచి భువనగిరివరకు పోయుటకై టిక్కెట్టు కొనుటకై సుమారు (౫౦) మందికి టిక్కెట్టుఅమ్ము ద్వారమువద్దకేగి నిలచినారు జనసమూహ మెక్కువవున్నందున ప్రక్కకు తొలగి చిన్నబండి బుకింగ్ ఆఫీసు వైపు నిలబడినారు. ఆబుకింగు ఆఫీసు అప్పుడు మూసివేయబడియుండెను. పెద్దబండి టిక్కెట్టుద్వారమువద్ద తనకర్తవ్య పాలనకై నిలచియున్న రైల్వేపోలీసు కానిస్టేబిలు నెంబరు (౫౯౬) "చల్ హట్ వహాం సే" అని వ్యవహారము మొదలు బెట్టెను. అప్పుడు అచ్చటయున్న జనసమూహములోనుండి కొందరు సజ్జనులు కానిస్టేబిలును బాగుగ చీవాట్లు బెట్టి వన్ను శాంతపరచిరి. తెల్లవారి యీ సంగతి కాయితము కానిస్టేబిల్ నంబరుతో సహా రైల్వేపోలీసు మొహతమీం గారికి కూడ పంపినాను. కావున ఎచ్చటనైనా ఈ ప్రకారము పల్లెటూరి ప్రజలపైన విద్యావిహీనులని అత్యాచారములు సలుపు మందురు. పల్లెటూరివాండ్లైవరైనను ఇట్టివిజరిగినచో వెంటనే నంబరువ్రాసికొని పైయధికారులకొక లేఖవ్రాసి టప్పాలో బనచేయవలయును. మనవార్తాపత్రికలలో గూడ ప్రకటింప చేయవలయును. పల్లెటూరివారంటే పరువు మరియాదహీనులనుకొంటారు. కావున పైయధికారులు ఇట్టి విషయములగురించి తగుదృష్టి నుంచవలసియుండును.

ఇట్లు
వి. ఎస్. దీనబంధు.

## ప్రకటన

జిల్లా వరంగల్ తాలూకా హుజురాబాదు. కొత్తకొండ శ్రీ వీరభద్రస్వామివారి ఉత్సవము 12 వ ఇస్ఫందారు పుష్య బ౹౧ రోజున జరుగగలదు. రైలు ప్రయాణీకులు హసన్‌పర్తి స్టేషన్‌లో దిగి ఎలుకతుర్తి మోటారుమార్గముగ రావచ్చును. వరంగలునుండి కిరాయమోటార్లుఏర్పాటుచేయనైనది, 13వ ఇస్ఫందారు పశువుల ప్రదర్శనము 14 సంగీత సభ కాగలదు.

యాత్రికులకు హోటలులు మరియు దొరతనమువారి పక్షమున డాక్టర్ల ఏర్పాటును చేయబడును.

ఇట్లు
వి. రామరెడ్డి
(మోతెమదు దేవల్ కమేటి)



## దావూదు దొంగకు శిక్ష

హైద్రాబాదు, డిసంబరు ౨౯

హైద్రాబాదులో గజదొంగ యగు దావూదుపై నేడు హైద్రాబాదు ఫౌజ్దారి న్యాయస్థానమందు మొత్తము ఆరుసంవత్సరముల కఠిన ఖైదుశిక్ష విధింపబడినది. నేరమునువిచారించుచుండ, పోలీసు పక్షానచెప్పినదేమనగా, ఇదివరలో దావూదు ౧౨సంవత్సరముల కఠినశిక్షవిధించబడి అనుభవించుచు ౧౯౩౯ ౧౨ వాడు జైలునుండితప్పించుకొని పారిపచ్చియుండెనది. ౧౯౪౦ నాటి జనవరి శంకరషేర్ హోటలులో ప్రవేశించి హోటలు యజమానిని తుపాకితో చంపుదునని భయపెట్టి రూపాయలనందుకొని పారిపోవుచుండగా పోలీసువారలతనిని అరెస్టుచేసియుండిరి.

న్యాయాధికారి దావూదుకు జేలునుండి పారిపోయినందులకు గాను ౨ ఏండ్ల కఠినశిక్షయు, బలవంతముగా దొంగతనముచేసినందుకునను రెండు సంవత్సరములశిక్షయును విధించిరి. శిక్షలను ఒకదాని తర్వాతనింకొకటి యనుభవింపవలసినదిగా తీర్పు చేసిరి.

## శ్రీవేమన ఆంధ్రభాషా నిలయము

(నాంపల్లి, హైదరాబాదు)

ఈ భాషానిలయము స్థాపింపబడి పదిహేను సంవత్సరములైనది. మొదటిఆయిదుసంవత్సరములు సిద్దిఅంబరుబజారులో నుంచినతరువాత ౧౩౩౯ ఫసలీలో నాంపల్లికిమార్చబడి, అప్పటినుండి నొకబాడుగగృహమునందు ప్రజాసేవచేయుచున్నది. ప్రస్తుతము ఏబదిమంది సభ్యులుకలరు. ౯౦౦ గ్రంథములుకలవు ౧౫ పత్రికలు వచ్చుచున్నవి. ప్రతిదినము సాయంత్రము ౫ నుండి ౮ గంటలవరకు. సెలవు దినములలో ఉదయమునకూడ తెరువబడుచున్నది. ఇంకను నెక్కువమంది ఈ భాషానిలయమువలన లాభముపొందు నవకాశము కలిగించుటకును, సభల సమావేశపరచుటకును, విశాలమగు స్వంతభవనమవసరమగుటచే, నాంపల్లి స్టేషనుకు వెనుకభాగమున, సర్కారీదవాఖానాకు సమీపమున, ౨౧౧౫ చతురపుగజముల స్థలము అరాయిషుజల్లావారినుండి ౭౦౦ రూపాయలకు కొనబడినది. దీనిమీద సుమారు ఎనిమిదివేల రూపాయల విలువగల భవనమును కట్టించుటకై ప్రయత్నములు జరుగుచున్నవి.

కె. సుబ్బారావు
కార్యదర్శి.

## ప్రధానమంత్రికి టంకసాలఉద్యోగుల మొర

హైద్రాబాదుదక్కన్ జనవరి ౨వ డిసంబరు ౨౯ వ తేదిని టంకసాల, స్టాంపుల శాఖలయందలి ఉద్యోగులు ౫౦౦ మంది "దిల్ కుష్ ఖానా" కరియించు టంకసాలగురించి ప్రధానమంత్రి సర్ అక్బర్ హైదరీగారికి మొరపెట్టుకొనిరి ప్రధానమంత్రిగారు వాటినిగురించి ఆలోచించగలమనిరి.











# ఆంధ్రోద్యమప్రచారము

## ఆంధ్రమహాసభాధ్యక్షులవారి పర్యటనము

తేదీ ౨౧ బహమన్ ౧౩౫౦ ఫసలి సాయంత్రం ౫ గంటలకు హైద్రాబాదునుండి ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీమందుముల రామచంద్రరావు, స్థాయిసంఘకార్యదర్శియగు శ్రీచిక్కపల్లి రామచంద్రరావుగారలు బయలుదేరి కల్వకుర్తికి మోటారుకారులలో రాత్రి ౮-౩౦ గంటలకు ప్రవేశించిరి. స్థానికన్యాయవాదులగు శ్రీమడపు జానకిరామరావుగారు, రంగంగారు ఏతెంచిన అతిథులకు అతిథ్యమిచ్చిరి. అంత్రి అచటివారితో ఇష్టాగోష్ఠిగాముచ్చటించితాలూకా సంఘస్థాపనకుకోరగా, అతాలూకా చాలా కబద్ధతాలూకాయనియు, ఆంధ్రోద్యమవిషయము ప్రజలకు సరిగా యింకను తెలియకనియు తెలుపుచు, బహిరంగసభ ఏర్పాటుచేయుంచిన మంచిసదవకాశము కలుగునని స్పష్టపరచిరి. ఆంధ్రమహాసభాధ్యక్షులు, వారికార్యదర్శిగారు అలాటిబహిరంగసభఏర్పాటు అనతికాలంలోనే చేయించబడునని సమాధానమిచ్చిరి. ఉదయము ౫ గంటలకు అధ్యక్షులవారు కార్యదర్శిగారును, స్థానికన్యాయవాదులగు శ్రీజానకిరామారావుగారితోండి, మిడిజిల్ల గ్రామం ౭ గంటలకుచేరుకొనిరి. మిడిజిల్లలో స్థానికులు, చుట్టుప్రక్కలగ్రామాదులవారు, అధ్యక్షులవారిని కలిసికొను నకు విచ్చేసిన సుమారు ౨౦౦ ల రైతులవద్దగారాలు సమావేశమైరి. స్థాయిసంఘకార్యదర్శిగారు అధ్యక్షులవారిని ఎరుకపరచి, వారి ద్వారా ఉద్దేశ్యములను తెలిపిరి. అధ్యక్షులవారు అచటహాజరైనపౌరులకు ఆంధ్రమహాసభోద్దేశములు, అదిదీనసాదలకుచేయుచున్నపనుల వివరములను తెలిపిరి. ఆంధ్రమహాసభలో ఎక్కువసంఖ్యగాచేరి లాభముపొందవలెనని కోరిరి "ఆంధ్రమహాసభకిజై" నినాదములతో సమావేశముముగిసెను.

మిడిజిల్లనుండి ౯ గంటలకు బయలుదేరి అధ్యక్షులవారు తమపరివారముతో బాజేపల్లికి ౯ గంటలకు చేరుకొనిరి. జిల్లాసంఘ కార్యదర్శియగు శ్రీ పి. హనుమంతరావుగారు అధ్యక్షులవారివెంట పర్యటనలో పాల్గొనిరి. బాదేపల్లి స్థానికప్రముఖులు యిచ్చినఉపహారతేనీరుగైకొని వారలతో ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకొని, కొన్నిరోజులనుండి నిద్రావస్థలోనున్న గ్రంథాలయమును తిరిగి నడిపించేఏర్పాటుగావించిరి. బాదేపల్లినుండి ౧౦ గంటలకుబయలుదేరి బిజినేపల్లి వి చ్చే సి బి జి నే ప ల్లి గ్రామరైతులు చుట్టుగ్రామాదులనుండి వచ్చినరైతులు ఆంధ్రమహాసభ కార్యకర్తలతో తమకష్టములు పైసలస్థితిగతులు నివేదించుకొనిరి. వారికి సముచితసమాధానమిచ్చుచు. తెలంగానాలోఆంధ్రమహాసభచేయుచున్న సేవావివరములను విశదపరచి బిజినేపల్లినుండి నాగరుకర్నూలుకు ౧ గంటకుచేరుకొనిరి. స్థాయిసంఘకార్యదర్శిగారి స్వగృహమునసే ఏతెంచిన అతిథులకు విడిదినొసగబడెను. స్థానికతాలూకాసంఘకార్యకర్తలువిచ్చేసి అధ్యక్షులవారినికలిసి ఉద్యమమునుగురించి ముచ్చటించిరి. భోజనానంతరం ౩ గంటలకు నాగరుకర్నూలునుండి బయలుదేరిఅచ్చంపేటకు ప్రవేశించిరి. మొదటినుండియే విచ్చేసి వేచుకొనియున్నపర స్థానికులు పురపౌరులువెంటనే సమావేశమై, వారివారియోగక్షేమముల ను అరసికొని, కార్యదర్శిగారు, అధ్యక్షులవారు వారికి ఆంధ్రమహాసభాశయములు. దానికార్యవిధానమును తెలిపిరి. తాలూకాసంఘస్థాపన ఆవసరమునుగురించి ప్రబోధించగా సంఘస్థాపనకై పురవాసు, అంగీకరించి వెంటనేతాలూకా సంఘస్థాపనజరిగి ఎన్నికలుజరిగెను. కార్యక్రమమునుముగించుకొని, తెల్కపల్లి కారుపాములమీదుగా. రాత్రి ౯ గంటలకు పెద్దకొత్తపల్లి గ్రామంప్రవేశించిరి, ౨౩-౩-౫౦ ఫ నాడు ఉదయం ౩ గంటలవరకు కారుపాముల, సెతాపురం గ్రామాలరైతులువిచ్చేసి, తమకష్టములు, జాగీరువారుచే కలుగుచున్నబాధలను ఆంధ్రమహాసభాధ్యక్షులతో తెలుపుకొనిరి. వారికి కార్యదర్శిగారు, అధ్యక్షులవారు, జిల్లాసంఘకార్యదర్శిగారు, క్రమపద్ధతినైన తమకష్టములను ఈడేరుటకు ప్రయత్నించవలయుననియు రైతులలో ఐకమత్యము అవసరమనియు. ఆంధ్రమహాసభచేతనైనంతవరకు జాగీరుపౌరులకుసహాయపడుచున్నదనినుడివిరి. పెద్దకొత్తపల్లినుండి ౯ గంటలకు ప్రయాణమైకొండరావుపల్లికి అధ్యక్షులవారు తమపరివారముతోచేరుకొనిరి, అచటసమావేశమైన ఇరుగుపొరుగు గ్రామాదులవారు సుమారు ౨౦౦ మందికి ఆంధ్రోద్యమముచేయుచున్న పనులవివరములను తెలుపుచు. ఈమహాసభకు శాఖోపశాఖలుగా జిల్లాసంఘములు, తాలూకాసంఘములు, పట్టీసంఘములు స్థాపించబడుచున్నవనియు, దీనివల్ల గ్రామగ్రామాదులలో ఉద్యమముసరిగా వ్యాప్తిచెందగలదనియు, దేశీయులందరు ఈసంస్థలోసభ్యులుగాచేరి బలముకలుగచేయవలయుననియు అధ్యక్షులవారుకోరిరి, జిల్లాసంఘకార్యదర్శిగారగు శ్రీహనుమంతరావుగారు ఆంధ్రమహాసభ ఉద్దేశములను. ఈ పర్యటనయొక్క ప్రయోజనమును వ్యక్తపరచిరి. కొండరావుపల్లినుండి ౨. గంటలకుబయలుదేరి కొల్లాపురం ౪ గంటలకు అధ్యక్షులవారు తమసహచర్యులతోచేరుకొనిరి, కొల్లాపురం ఆంధ్రోద్యమకార్యకర్తలతో ఇష్టాగోష్ఠిగాముచ్చటించిరి. రైతులపరిస్థితులు, విద్యావిషయములు, మున్నగు సంగతులుకనుక్కొని, స్టేటు వారిఆధీనములోనున్న వేంకటలక్ష్మణరాయ గ్రంథాలయమును దర్శించుటకు వెళ్లగా మూయబడియుండెను. ఇటీవలనేకొందరు ఉత్సాహవంతులుచే సకులచే నడిపింపబడుచున్న పఠనాలయమునుచూచి, తేనీరువిందుస్వీకరించి, సాయంత్రము ౭ గంటలకు పెంట్లవెల్లిచేరిరి. పురపౌరులు వాయిద్యములతో ఎదుర్కొనిఅధ్యక్షులవారిని వారిపరివారమును గ్రామమునకుతీసికొనివెళ్ళిరి. శ్రీచక్రపాణివరప్రాజుగారు వచ్చినవారినందరిని ఎరుకపరచిరి. సమావేశమైన ౫౦౦ పురపౌరులకు ఆంధ్రోద్యమముయొక్క ఆశయములు, ఆదిగాము వాసులకు, బీదసాదలకుచేయుచున్న పనులను వివరముగాతెలిపిరి. అచటినుండి రాత్రి ౯ గంటలకు ప్రయాణమై జటప్రోలుమీదుగా రాత్రి ౧౧ గంటలకు వనపర్తికి ప్రవేశించి విశ్రాంతిగైకొనిరి,

౨౪-౩-౧౩౫౦ ఫ ఉదయం ౭ గంటలకు వ్యాపర్లనుండి బయలుదేరి అధ్యక్షులు తమసహచర్యులతో పెబ్బేరు గ్రామమునకుచేరిరి. పురపౌరులు వాయిద్యములతో ఎదుర్కొని తోరణాలతో అలంకరింపబడిన శ్రీమహాభూపాలగ్రంథాలయమునకు తీసికొనివెళ్లిరి.

గ్రంథాలయపక్షమునను, పౌరులపక్షమునను సన్మానపత్రములర్పింపబడెను. అధ్యక్షులవారు సమాధానమిచ్చుచు, ఆంధ్రోద్యమఆశయములను తెలిపి, ఆంధ్రమహాసభవల్ల లాభముపొందవలసినదికోరిరి. జిల్లాసంఘకార్యదర్శిగారు ఆంధ్రమహాసభసభ్యులుగాచేరి సంస్థకుబలముకలించవలెనని ప్రబోధించిరి. అచటిప. ముగించుకొని శ్రీగంగాపురంలోగాడియున్న రైతులుమున్నగువారికష్టములనువిచారించుకొని వనపర్తిమీదుగాగోపాలపేటకు ౧౧ గంటలకు ప్రవేశించిరి. గోపాలపేటరైతులు, పౌరులునువిచ్చేసివచ్చి ఆంధ్రమహాసభాకార్యకర్తలనుకలిసికొని తమతమఅవసరములు తెలిసికొనుటకు కల్పించియుండిరి. తుదకు ఈ సంగతి తెలువగానే అధ్యక్షులవారు జిల్లాసంఘకార్యదర్శిగారు ఉభయులుకలిసి, ఇండ్లకేస్వయముగా వెళ్ళుటకుబయలుదేరిరి దారిమధ్యనపోలీసువారు అరడజనుకుపైగా అధ్యక్షులవారివెంబడుండిరి. రైతులయిండ్లకువెళ్ళినను, వారుఈదృశ్యమునుజూచి,యదార్థపుసంగతులుతెలుపుకొనకపోయిరి. పోలీసువారికిఈవిధముగవెంబడించుట భావ్యముకాదని అధ్యక్షులవారు హెచ్చరించినను, పోలీసువారుమాత్రం ఆంధ్రమహాసభవారు గ్రామంవదులువరకు వారలనువదలక వెంబడించుచుండిరి. తుదకు ఎవ్వరూ కాయకదలేసమయమున రైతులకష్టములనుగురించి వ్రాతపత్రమునుకారులో పడవేసిరి

గోపాలపేటనుండి ౧-౩౦ గంటలకు బయలుదేరి వనపర్తికిఏతెంచిరి. వనపర్తిలో విద్యార్థివసతిగృహమున, ఆంధ్రమహాసభాకార్యకర్తలను పుష్పమాలలతో సన్మానించిరి విద్యార్థులుచూపి న ప్రేమ అదరానికిఅధ్యక్షులవారు కృతజ్ఞతలర్పించిరి. జలాలుద్దీన్‌గారు ఏర్పాటుచేసిన తేనీరు విందుస్వీకరించి, ఖాదీవస్త్రాలయమునుదర్శించి, ౩-౩౦ గంటలకు, కొత్తకోటకుచేరుకొనిరి. అదివరకే వేచుకొనియుండిన, పురవాసులు, చుట్టుప్రక్కగ్రామాదులరైతులు మున్నగువారికి ఆంధ్రమహాసభా ఉద్దేశములను తెలిపి, ఈసభచేయుచున్నపనులవల్ల లాభముపొందవలయునని అధ్యక్షులవారు తెలిపిరి, అచటినుండి సాయంత్రం ౫ గంటలకు బయలుదేరి వ్యాపర్లమీదుగా మారుమునగాలకుఏతెంచి రాత్రివిశ్రాంతిగైకొనిరి.

## చొప్పదండి

### రాత్రిపాఠశాలపై అనుమానము

(ఒకవిలేఖరి)

౨౭-౩-౧౩౫౦

చొప్పదండి కరీంనగరంతాలూకాలో చేరినది ఇదివరకు ఇచట ఒకఉచితరాత్రి పాఠశాల నడుపబడుచున్నది. కొందరుయువకులు దీనిలో విద్య నేర్చుకొనుచుండ స్థానికనాకెదారు తనరిపోర్టులో ఇచటఒకమతసంబంధమైన సంఘం నిర్మించినారనియు దీనిలో వ్యాయామము లాఠీ చేరు యు వ కు లు నేర్చుకుంటున్నారనియు అ స త్య ము తె లి పి యు న్నా డ ట. మొన్న సర్కిల్‌యిన్స్పెక్టర్‌గారు ఇచ్చటికి వచ్చియుండ గిర్దావరుగారు పగలు ఆ రాత్రిపాఠశాలవద్దకు తీసుకపోయి వానిద్వారము మూసియుండ ప్రాకారముచుట్టుతిరిగి గోడపైనుండి చూచి యేమేమోఅన్నారట.

## డాకూరు

### డివిజన్ అధికారిచే తలఫ్‌నూలు దరఖాస్తుల విచారణ

(ఒ.వి) ౨౧-౧-౨-౪౦

అందోలుతాలూకాలోని డాకూరుగ్రామానికి డివిజన్‌సాహెబుగారు తలఫ్‌మాల్‌విషయములో ౪-౩-౫౦ తేదినాడుతరదెంచి మునుపు చెరువుక్రిందతలఫుమాలునంబర్ దరఖాస్తులు యిచ్చినవికైలుచేయించి కేర్లమీదనుంచి ఒక్కసుల్సు, రెండుసుల్సులుచూపి కొన్నినంబర్లకు మంజూరుఇచ్చినారు. దరఖాస్తులు ఇవ్వనినంబర్లకు నాకుఅవసరంలేదుఅని. తలఫుమాలు పంచునామాలుచేయలేదు. కొందరురైతులకు కుంట్లకునీరురాక మోటనుంచి పండించినదానికి ఖుష్కిపన్ను యిచ్చేఅందుకు దరఖాస్తులుయిచ్చిఉన్నారు. అట్టినంబర్లకు సరియైనవరహాలు వ్రాయనందున పట్వారీలకర్తవ్యమనిరి యిందుకై పట్వారికైఫియతుకోరగా వారు యేమికైఫియత్ యిచ్చినారో మాకు తెలియదు.

వర్షాకాలంలో గ్రామంమధ్యనుంచి బండ్లకు పోవుటకై తగినదారిలేనందున మధ్యగ్రామంనుండి కొన్నిపొలాలకు నీరుకైకాల్వఉన్నది దానిని మరమ్మతుకొరకై రైతులుఆట్టిస్థలమును డివిజన్‌సాహెబుగారికి చూపించిరి. దరఖాస్తుమీదదానివిషయమై సంతకాలుచేసియిచ్చిరి. దానినిచూచి డివిజన్‌సాహెబుగారు తగినఏర్పాటు చేయించెదమనిరి.

# హిందూమహాసభ ఒత్తిడి ఫలితము

## అడిగినదానిని ఇండియామంత్రి ఒప్పుకొన్నాడు

### ౨౨ వ హిందూమహాసభలో వీరసావర్కరుగారి అధ్యక్షోపన్యాసము

౨౨వ అఖిలభారత హిందూమహాసభాధ్యక్షుడగు వి. డి. సావర్కరుగారు డిసంబరు ౨౭వ తేదిన మధురకు ప్రత్యేకముగ ఏర్పాటుచేయబడిన రైలుబండిలో వచ్చిచేరిరి. వారివెంట చాల మంది ప్రతినిధులు వచ్చిరి. రైలుస్టేషనులో వారు దిగినపుడు ౧౫౦౦౦ మందిజనులు స్వాగతమిచ్చుటకు వచ్చిరి— మీనాక్షీదేవాలయమున్నగు దేవాలయాల పూజారులు వారికి దేవాయత నార్హ సత్కారములుచేసిరి.

సావర్కరుగారిని పైకప్పులేని ఒకరథములో కూర్చుండబెట్టి ఊరేగించిరి. అరథమువెనుక ఇతరనాయకులును ప్రతినిధులును ఉండిరి, మొత్తముఊరేగింపులోకూడా ఉండినజనము ఒక మైలుపొడవుండెను. ఊరేగింపు పురోభాగమునయందు అలంకృతములైన ఏనుగులు నడచుచుండెను. మరియు ఊరేగింపువెంట దేవాయతనములలో దేవతల ఊరేగింపులలో వాడబడు ఛత్ర ధ్వజ పతాక తోరణాదులన్నియు యుండెను తోరణములతోను కమానులతోను అలంకృతమైయుండిన అయిదుమైళ్ళ మార్గమును పూర్తిచేసివచ్చుట కాయూరేగింపునకు రెండుగంటల కాలముపట్టెను.

## అధ్యక్షోపన్యాసము

హిందువులు వీరజాతిగా పునర్జన్మ మెత్తవలెనని సావర్కరుగారు తమఅధ్యక్షోపన్యాసములో చెప్పిరి. సంపూర్ణఅహింసాసిద్ధాంతము చాద స్తపుసిద్ధాంతమనియు హిందువుల క్షేమమునకు ఉపద్రవకరమనియు చెప్పిరి. హిందువులలో వీరోత్సాహమును పురికొల్పవలెను, అదియే నేటి పెద్దఅవసరము, దీనిఆధారముతో హిందువులు సంఘటన కావలెను— అనిసావర్కరు చెప్పిరి.

హిందువులు యుద్ధయత్నాలలో ... వలెనని సావర్కరుగారుచెప్పుచు హిందువుల సైనికశక్తి అలవడుటకును, దేశములో పరిశ్రమలు అభివృద్ధియగుటకును అట్లుచేరవలసిన అవసరమున్నదనిరి. "హిందువులారా, మీరు సేనలలో గాని నావికదళములో గాని, వైమానికదళములో గాని, యుద్ధావసరసామగ్రిని తయారుచేసేయంత్రాగారాలలో గాని చేరకున్నచో ముసల్మానులు కొంటకచేరగలరు. అందువల్లమీరు బ్రిటిషుప్రభుత్వమును దుర్బలపరచుటకుమారు గా, మీదేశంలోనే మిమ్ములను బానిసలగా చేయుటకై అంతకంటె తక్కువగాని పట్టుదలకలిగియున్న వారికి బలమిచ్చినవారగుదురు, అనిసావర్కరుగారుచెప్పిరి.

హిందూమహాసభగతసంవత్సరముచేసినపనిని సావర్కరుగారు ఒక సారిసింహవలోకనచేసి, "ముస్లింలీగున్న, కాంగ్రెసున్న కుదుర్చుకొనే ఏ ఒడంబడికగాని హిందూమహాసభఇష్టముతో ఒప్పుకొనవంతవరకు హిందువుల హక్కులను అమ్మజాలదు, గిర్వీపెట్టజాలదు, లేక విక్రయించివేయజాలదు," అనిచెప్పిరి.

ఆమెరీగారును, వైస్రాయిగారును ముస్లింలీగు విషయములో అవలంబించిన వైఖరిని సావర్కరుగారు మెచ్చుకొనిరి. హిందుమహాసభవారి ఒత్తిడివల్లనేఆమెరీగారు భారతదేశము ప్రథమదృష్టిలోనుండకలెనను అదర్శమును చెప్పెడిఉపన్యాసముచేసి యుండిరని సావర్కరుగారు చెప్పిరి.

### అఖిలహిందూఉద్యమము

హిందువులందరును ఒకటిగచేయు ఉద్యమము కావలెననిచెప్పుచు సావర్కరుగారు హిందూసంస్థానాధీశులు అఉద్యమమందు అభిరుచిగలిగియు ... చెప్పిరి. ...

కడిలించకపోయిరని, లేక దానికిభారతదేశంలో నిముసల్మానుసంస్థానాధీశుల భారతదేశంలోని ముసల్మానుల రాజకీయపక్షాలవైపుచేరి, అఖిలఇస్లాంలోకము ఎంతతీవ్రముగా: ఎంతధైర్యముతో, ఎంత మతభక్తితోగలిగియున్నారో అంతతీవ్రముగా, అంతధైర్యముతో అంతభక్తితో సహాయముచేయకపోయినగిన, అందుకుతప్ప కేవలము హిందూసంస్థానాధీశులదిమాత్రమే గాదు.

సామాన్యముగా హిందూప్రజలను. ప్రసిద్ధముగా కాంగ్రెసుహిందువులును హిందూసంస్థానాలకు ఏమాత్రము సానుభూతిచూపియుండలేదు. లేదా వాటిప్రాముఖ్యమును గ్రహించియుండలేదు. అంతటితోనైన ఊరకుండక తామే దేశభక్తులమని చెప్పుకొనుచు హిందూసంస్థానాలు భారతదేశాభివృద్ధికి ఆటంకాలనియు, వాటిని ఎంత వేగముగాలేకుండచేసిన, దేశానికి అంత మేలనియు నీచముగాచూచినారు. ముసల్మానుజనులు అట్లుగాక రాజకీయయథార్థములను సరిగాగ్రహించి భారతదేశములోఉండే కొద్దిముసల్మానుసంస్థానాలైనను ఉండుటతమకు గర్వించదగినవిషయమనితలచిరి కాబట్టి ముసల్మానుసంస్థానాధీశులుకూడ తమవర్తమానక్షేమమే గాక, భావ్యున్నతియు. కీర్తియు భారతదేశంలో ముసల్మానురాజకీయనాయకులచే నడుపబడుచున్న అఖిలముసల్మాను ఉద్యమముయొక్క బలాభివృద్ధులపైఆధారపడియున్నదని ఎల్లప్పుడును నమ్మియున్నారు.

"మీరింతఅగత్యులవలె నుండుటకు కారణము సాధనసంపత్తిలేకుండుటకాదు, మరేమన రాజకీయయథార్థములను గ్రహించే దూరదృష్టిలేకపోవుటయే" విమ్ములసావర్కరుగారు హిందూమహాసభకు, కాంగ్రెసుతోను, ముస్లింలీగుతోను, ప్రభుత్వముతోనుగల భేదములనువివరించిరి.

### హిందూమహాసభ లీగుకాంగ్రెసు

"తాను హిందువుల ప్రతినిధినంచున్నందుకు కాంగ్రెసు అగ్రహించుకొనుటయే గాకుండ. సింధురాష్ట్రమును వేరుగాఏర్పాటుచేయుట, కమ్యూనల్ అవార్డు, సరిహద్దువిధానము, హిందూస్థానిభాషయున్నగు పలుదలకొలది విషయాలలో తరవాదమును పరల సంశయములేకుండునట్లుగా రుజూవుచేసియున్నది. ప్రభుత్వమువారు కాంగ్రెసులీగు అనగా హిందూముసల్మానుప్రతినిధుల మొత్తమనుభావము కీడ్పరిరి. హిందువులకువారి ప్రత్యేకకర్తవ్య విషయాలలో ప్రభుత్వరాజ్యాంగ విషయకాలలో తనలయందు అభిప్రాయమిచ్చుటకు తగిన ప్రసంగములేకుండా పోవుటయేగాక వారికిష్టమైనంత లేనిఅభిప్రాయాలు చెప్పేప్రతినిధులేర్పడినారు."

కాని దినదినప్రవర్ధమానమగుచున్న హిందూమహాసభపలుకుబడియు స్వప్రయోజనములకు పరులను తుదకుప్రభుత్వమువారిని, ఇకమీదకాంగ్రెసుహిందూప్రతినిధులసంఘమని తలచుటకుగాని, హిందూమహాసభ హిందువులప్రతినిధియని ఒప్పుకొనజాలమనుటకుగాని వీలులేదనిగ్రహించునట్లు చేసినవి. ఈ విధంగాఇండియాప్రభుత్వకాంగ్రెసున్ను లీగున్నుకలిసి భారతదేశప్రజలకు సమానమనే పాఠాన్నివదలుకొని హిందూమహాసభ లీగు, కాంగ్రెసుకలిస్తేగాని భారతీయులప్రతినిధులు సంపూర్ణముగాకూడినట్లు కాదనేకొత్త పాఠాన్ని నేర్చుకొనవలసివచ్చినది. హిందూమహాసభస్థానాన్ని నిర్ధారణగా ఒప్పుకొన్నందుకు వైస్రాయిగారికి సావర్కరుగారు కృతజ్ఞతచెలిపిరి.

పాకిస్థాన పద్ధతినిగురించి సావర్కరుగారు ఇట్లుచెప్పిరి. భారతదేశమంతయు అఖండము, అవిభాజ్యముఅని ఆమెరీగారు స్పష్టముగా చెప్పినందుకును, ఇటీవల యుద్ధసలహాసంఘ నిర్మాణ విషయంలోను వైస్రాయిగారి కార్యవర్గవిస్తరణ విషయంలోను లీగువారుతెలిపినట్టి అనేకములైన హిందూప్రతికూలములైన దురాశాభూయిష్టములైనకోరికలను వైస్రాయిగారు త్రోసివేసినందుకును వారుసావర్కరుకృతజ్ఞతతెల్పిరి

ముగింపు

ఉపన్యాసమునుముగించుచు సావర్కరుగారు మహాసభవారి రాజకీయపుకోరికలను వివరించిరి. "హిందూమహాసభవారు తెలిపినకోరికలను ప్రభుత్వమువారు చులకనచేయలేదని నేనుస్పష్టముచేయవలసియున్నది. యుద్ధముముగిసినతర్వాత రెండేండ్లలో డొమినియన్ స్టేటసు అధినివేశప్రతిపత్తి) ఇవ్వబడునని ప్రకటించండి అనివారిని మేముకోరుచున్నాము, వైస్రాయిగారును ...



ధ అతనిని కూర్చుండబెట్టెను ప్రాణనాథ!!! వైద్యుడా నేడు నేమేమో బలుకబోయెను ... సభ్యులసంరా దయ్యె. గౌరవముపై ప్రాణమిచ్చు ... నేడు సాధారణ స్త్రీల విధమున శక్తి లయ్యెను.

చంపత్ రాయ్:—సారణ, చూడు వీరుడొకడు మృత్యుముఖమున బడినాడ 3-0 ... మనభయమునకు కారణమగుచుండె. ... చ్చెను. వాకన్నులఎదుట నేను ... 3-0







# ప్రకటన

9 బహిమన్ 1350 ఫ. గోలకొండపత్రికలోను, 9 బహిమన్ 1350 ఫ. ముషీర్‌దక్కన్ పత్రికలోను కొత్త వెంకటనారాయణరెడ్డి ప్రకటించిన ప్రకటనలకు జవాబుగా కొత్తవీరయ్య వల్లు రామయ్య సాకీన్ వెన్కపల్లి తా॥ హుజూరాబాదు జిల్లా వరంగల్ యిందుమూలముగ నీకు తెలియపరచుట యేమనగా నీవు పైన పేర్కొనబడిన పత్రికలలో ప్రకటించిన విషయములు పూర్తిగా తప్పులును అబద్ధములునైయున్నవి, నేను భగవంతుని దయవలన సరియైన మానసిక స్థితియందున్నాను, అకారణముగానాకు సరిపడని దుర్మార్గుల ప్రబోధమువలన అక్రమమైన ప్రకటనలు చేసినదంతయు సర్వఅబద్ధము. నేను నీకు చిన్నతనమునసే ఎల్లానుపురం వాస్తవ్యురాలగు చెల్మెళ్ళ రాజయ్యభార్య రాజమ్మకు యిల్లటపుఅల్లుడుగాచేసి, తరువాత అక్కడ చాల ఆస్తినిసంపాదించి నిన్ను ఆస్తిపరుని గాచేసితిని. ఈవిషయము నీకున్నూయును గా తెలిసియేయున్నది. అయినప్పటికి ఈనీచర్యలు విచారకరముగా యున్నవి. పిత్రార్జితమైన ఆస్తివిషయములో, మీ తాతగారు తామబ్రతికియున్నంతవరకు తన స్వాధీనములో యుంచుకొని సుమారు నాల్గుసంవత్సరముల క్రిందట మరణించియుండెను అదిగాక ఈ ఆస్తిపై అప్పుభారము చాల యున్నది. నీకు తెలిసినవిషయమే. ఇంతేగాక నేను నీ తాతగారి కాలములోనే విభాగమై నా స్వంతముగా చాలఆస్తిని సంపాదించుకొని యున్నాను. యీ విషయమునీకున్నూ మరియు అందరికిన్నీ తెలిసినదే. అందువలన నీకున్ను మరియు అందరికిన్నీ యిందువలన తెలియపరచుటయేమనగా నా స్వంత ఆస్తివిషయములో నీ ఆటంకముగాని హక్కుగాని యుండజాలదు. నా స్వాధీనములోయున్న ఆస్తియందు ఎక్కువభాగము నా స్వార్జితమైయున్నది కొంచెము మాత్రమే పిత్రార్జితమయి యున్నది. న్యాయశాస్త్రప్రకారము ఈ ఆస్తిపై దానా దమన విక్రయాది అర్హతలును గలిగియున్నాను. నీవు ప్రకటించిన విషయములేవియు చెల్లనేరవు.

ఫక్తు.

వెన్కపల్లి తా. హుజూరాబాద్ జి. వరంగల్ } యిట్లు కొత్త వీరయ్య వల్లు రామయ్య

క్రిటరీఆఫ్‌స్టేటు (ఇండియామంత్రి) గా ౯ను భారతదేశమునకు యుద్ధానంతరము సాధ్యమైనంత్వరలో తాము(బ్రిటిషు)అనుచున్నట్టిదానిని ఇండో బ్రిటిషు అనవలసినదని వారికి కామన్వెల్తులో సమానగౌరవమున్న స్వపరిపాలనగల రాజ్యప్రపత్తోదాయివ్వబడునని స్పష్టపరచినారు. భారతదేశమును ఖండములు చేసే విధానాన్ని ప్రోత్సహించేకోరిక తమకులేనట్లు ప్రకటించవలెనని మేము వారలను కోరియుంటిమి అదేవిధముగా ఆ మెరీగారు హిందూమహాసభవారి ఒత్తిడిచే ప్రకటించినారు"నిచెప్పిరి

## తీర్మానములు

ఈ హిందూమహాసభనాడు ఒకగొప్ప భారమును పెట్టేరాజకీయతీర్మానమును ఆమోదించినారు. ఈతీర్మానము యన్.సి. చటర్జీ గారిచే బహిరంగసభలో ప్రతిపాదింపబడెను. అతీర్మానములో మొదట వైస్రాయి గారును స్క్రెటరీ ఆఫ్‌స్టేటు గారును దేశంలో రాజకీయమైన చిక్కు—హిందూమహాసభవారి తోడ్పాటులేనిదతొలగించనీలుగాదని ఒప్పుకోన్నందుకు మెప్పు చేయబడినది. మహాసభవారికి సంపూర్ణస్వాతంత్ర్యమే యిష్టమైనను, ఇప్పటికిమాత్రము వెస్టిమినిస్టర్ శాసనమునేదానిలో నిర్వచింపబడినట్టి డొమినియన్‌స్టేటసు వ్యవస్థనొప్పుకొనుటకు తాముసిద్ధమేనని తీర్మానములు చెప్పబడినది కానిఅంతవరకు వైస్రాయిగారును, స్క్రెటరీఆఫ్‌స్టేటుగారును రాజ్యాంగవ్యవస్థనుగూర్చి చెప్పినవచనములుఅస్పష్టములుగ, సంతుష్టికరాలనివియునై యున్నవని మహాసభవారిఅభిప్రాయములు. కాబట్టియుద్ధం ముగిసినతర్వాత ఒకసంవత్సరములోగా వెస్టుమినిస్టర్ శాసనపు డొమినియన్‌స్టేటసు భారతదేశానికియివ్వబడుననియు, భారతదేశమంతా ఒకేఅఖండరాజ్యముగాను జాతిగానుఉండబడునట్లుగా రాజ్యాంగమునిర్మించబడగలదనియు. అల్పసంఖ్యాకులహక్కులను, క్షేమమునురక్షించుటకై న్యాయమైనరక్షణలనుయేర్పాటుచేసినను, దేశంలోఅధికసంఖ్యాకుల హక్కులకు క్షేమానికిని ఏవిధానగాని భంగము కలుగనీయబడదనియు—స్పష్టముగాను, సందేహానికవకాశంలేకుండాను ప్రభుత్వమువారు వెంటనేఒకప్రకటనచేయవలెనని అతీర్మానములోకోరబడినది. పాకిస్థానవిధానముతమకువిరుద్ధమని స్పష్టముగాప్రకటించనందుకు బ్రిటిషుప్రభుత్వమువారివైఖరి తీర్మానములో ఆక్షేపించబడినది. కాబట్టి బ్రిటిషుప్రభుత్వమువారు వెంటనే పాకిస్థానపద్ధతినితాము సహించమని ప్రకటించవలెనని తీర్మానములోకోరబడినది. ఈరెండుకోరికలను తీర్చునట్లుప్రకటనను ౧౯౪౧మార్చి ౩౧వతేదిలోగాప్రభుత్వంవారుచేయనిచో మహాసభవారికోరిక సాధించుకొనుటకై కఠినచర్యనుదిగగలదను వెదరింపుతీర్మానములో తుదిగలదు ఈతీర్మానమునకు నల్గురుమాత్రమే ప్రతికూలంగాఓటునిచ్చిరి. ఈ కఠినచర్యగైకొనువిషయములో పద్ధతులను ఆలోచించుటకై సావర్కరుగారు,శ్యామప్రసాద ముఖర్జీగారు,డాక్టర్ మూంజీగారు,కపర్ది, దేశ్పాండే, భోపట్కర్,భాయీపరమానంద్,భారత్ మిశ్రాగారలు సభ్యులుగాగలఒకఉపసంఘమేర్పాటుచేయబడినది.

హిందూరాజకీయఖైదీలనందరిని వెంటనే విడుదలచేయవలెననియు, దేశాంతరాలకు తరిమివేసిన హిందువులను తిరిగి దేశానికి రప్పించవలెననియు కోరుతీర్మానములు చేయబడినవి.

అమెరికాకాన్సల్ జనరల్ రాక

హైదరాబాదు, బహ్మన్ ౨౮

అమెరికాకు కన్సల్‌జనరల్ అగు సి. సి జోన్స్‌గారు డిసెంబరు ౨౫వ తేదిఉదయం ఇక్కడికి ఔరంగాబాదునుండివచ్చినారు. ఇక్కడరెండురోజులుండి పోగలరు ఔరంగాబాదులోవారు ఎల్లోరా, అజంతాగుహలచిత్రములను చూచిరి. వారివెంట వారిసతీమణిగలదు.



ఖఫీఖాన్యాయవాదుల సంఘసభ

హైదరాబాదు(దక్కను)౨౭బహమన్ హైకోర్టున్యాయాధికారిఅగునవాబు జీనయార్ జంగు బహదరుగారికి ఉద్యోగపుకాలం హెచ్చింపుజరిగినందువలన సంతోషమునుచెప్పుటకై ఖఫీఖా న్యాయవాదుల సంఘమువారు పండితగోపాలరావుయెక్బోటే హైకోర్టుకీలుగారిఅధ్యక్షతలో సభజరిపిరి. సభలో న్యాయమూర్తిగారికి ఉద్యోగకాలము పొడిగించినందులకు నిజాం ప్రభువుగారికికృతజ్ఞతతెల్లడించిరి.

—౫ వ పేజీ తరువాయి

ఛత్రసాలుడు నడుమనుండి వంగి రాణి పదములను తాకెను. రాజు ఆకాశమువైపు హస్తములుచాచి, "దయానిధీ, నేను నా చతురడగు పుత్రుని బుందేలులగౌరవముకొరకు నీకర్పించుచున్నాను, మా గౌరవమురక్షించుట నీపని. నేనతిమూల్యవంత మైనవస్తువు నీ కర్పించుచున్నాను. స్వీకరించుము".

రెండవదినము ప్రాతఃకాలమున, సారంధ స్నానమాచరించి, పూజాసామగ్రిచేబూని నుంది రమునకరిగెను. ఆమెమోము, కళ దప్పియుండెను కన్నులయందు చీకటి క్రమ్మినట్లుండెను ఆమె, మందిరద్వారముచెంత కరిగినంతనే నొక యమ్మపుల్ల పైనుండిగిరివచ్చి నామెసమీపమున బడెను. అయమ్మపుల్లచివరకొక లేఖ వ్రేలాడుచుండెను. సారంధ పూజాసామగ్రి నొకగద్దెపై నునిచి, నా లేఖను యమ్మపుల్లనుండి విడదీసి పఠించుచుండగా, నామె ముఖముపై నానంద చిహ్నములు గోచరించుచుండెను. కానీయానందము శీఘ్రమే యంతరించెను. "ఒక్క లేఖకొరకు నా ప్రియపుత్రుని పోగొట్టుకొంటి. కాగితపు ముక్క కింతఅమితమైన వెలనిచ్చి, నేనదుగొంటిని."

మందిరమునుండి సారంధతిరిగి చంపత్ రాయ వద్దకువచ్చి,

"ప్రాణనాథా! ఆజ్ఞాపత్రము గొనివచ్చితి, మీరు మీమాటనుండి దొలగకుడీ" రాజాశ్చర్యముతో నడిగెను, "నీవు నీమాట చెల్లించుకొంటివి"

రాణి ప్రతిజ్ఞాపత్రము రాజుకందజేసెను. చంపత్ రాయ దానిని గౌరవముతో నందుకొనెను, "ఇక నేనుకెళ్ళెదను. పరమేశ్వరుని దయయున్న మరలొకమారు శత్రువుతో బోరాడెద, కాని, సారణ్, ఈపత్రముకొరకు నేమియర్పించితివి. నిజము వచింపుము."

రాణి:—(దీన స్వరముతో) "భాలా"
రాణి:— వినుపించుము?
రాణి: —ఒక వీరపుత్రుని
రాజు, దుఃఖితుడై :— ఎవరిని అంగదరాయునా?
రాణి:— కాదు.
రాజు: — రత్నసాహునా?
రాణి:— కాదు.
రాజు: —ఛత్రసాలునా?
రాణి:— అవును.

తుపాకిగుండు తిన్నతర్వాత, పక్షి, ఘడాఘడాయని కొట్టుకొనుచు నేలక్రిందబడునో నదే రీతి చంపత్ రాయ మంచముపైనుండిలేచి క్రిందబడెను. ఛత్రసాలుడతని ప్రియపుత్రుడు. ఆతని భవిష్యదుద్దేశములన్నియు నతనిపైననే యాధారపడియుండెను. సచేతుడైపలికెను, "సారణ్, చాల చెడ్డపనిజేసితివి, ఛత్రసాలుడే హతుడయిన బుందేలావంశనాశము నిశ్చయముగా జరుగును,"

నల్లనిచీకటి గమ్మినర్వాతి, రాణిసారంధ గుర్రముపై మరియు రాజాచంపత్ రాయ పాలకిలో గూర్చొని దుర్గముయొక్క రహస్య మార్గమునుండి వెడలిపోవుచుండిరి. నేటికి చాలాదినముల క్రింద నొకనాడీవిధముగనే అంధకారము మరియు దుఃఖముచే నావరింపబడిన రాత్రియందు సారంధ శీతలాదేవితో కొన్ని కఠోరవచనములు బలికియుండెను. ఆసమయమున శీతలాదేవిపలికిన భవిషద్వాణి సత్యముగానే పరిణమించెను. ఏమి, సారంధ పలికినవచనములు గూడ క్రియారూపము దాల్చునా?

౬

సూర్యాస్తమయము సూర్యభగవానుడు వహ్నివర్షము కురిపించుచుండెను. శరీరమును విసిగింపజేయునటువంటి ప్రచండవాయువు పర్వతములలో నగ్ని రగులజేయుచుండెను. అగ్నిదేవతయొక్క సమస్తసేనలు గర్జించుచున్నవా యనునట్లుండెను. గగనమండలమీ భయముతో గడగడ వడకుచుండెను రాణిసారంధ గుర్రముపై మరియు రాజాచంపత్ రాయ పాలకీపై పశ్చిమదిశ బోవుచుండిరి. ఓరోఛానుండి పదికోసుల దూరము వెళ్ళిరి భయక్షేత్రమునుండి బయటపడితిమని సంతోషించుచుండిరి. రాజు పల్లకియందచేతుడై పడియుండెను. బోయీలు చెమటతో నిండియుండిరి ఏంజవయిదుగురు గుర్రపుస్వారులు వచ్చుచుండిరి. దప్పిచే వారినాలుకలు గుంజుకపోవుచుండెను. సమీపమునచెచ్చటనైన తటాకముగలదేమోయని వెతుక నారంభింపనుండిరి. ఇంతలో, సారంధ వెనుకకు మరలిజూడగా కొందరుస్వారులు వచ్చుచున్నట్లు గనబడిరి. వీరు శత్రువులు గాబోలు యని సారంధ విచారింపనుద్యమించెను. కాని ఛత్రసాలుడు సైనికులతో వీరిసహాయమునకు వచ్చుచుండెనేమోయని దలంచెను. నిరాశాసమయములందుగూడ ఆశ సంతోషపరచుచునే యుండును, కొన్ని నిమిషము లీవిధమున నే ఆశ మరియు భయముతో గడచెను. ఇంతలో సైనికులు సమీపించిరి. రాణిముఖము వాడిపోయెను. ఆమెశరీరము వణక మొదలిడెను. వీరు శత్రుసైనికులు.

"డోలినాపుడ"ని రాణి శలవిచ్చెను. బుందేలా వీరులుగూడ ఒరలలోనుండి కత్తులుగుంజిరి రాజు మిగుల శోచనీయావస్థలోయుండెను కాని అణచబడిన యగ్నివాయువీచగనే ప్రజ్వలించునట్లు. కష్టకాలము సమీపించినదని తోచిన తోడనే యతని బలహీనమైనశరీరము వీరాగ్నిచే మెరయజొచ్చె పాలకి పర్దాదొలగించి క్రిందికి దిగి ధనుస్బాణముల ధరించెను. కాని ఎవరిచేతులలో నాధనుస్సు ఇంద్రుని బాణము పగిది వంగుచుండెనో నేడది అవంతయు వంగలేదు. తలదిరుగజొచ్చెను. కాళ్లు వణకెను. క్రిందపడెను. రెక్కలు లేనిపక్షి సర్పము సమీపించుచుండగా నే రీతిపెనగులాడుచు పడుచుండునో నదేరీతి చంపత్ రాయ లేవబోవుచు క్రిందబడుచుండెను. సారంధ అతనిని కూర్చుండబెట్టెను ప్రాణనాథాయని నేడ్చుచు నేమేమో బలుకబోయెను కానినోరు రాదయ్యె. గౌరవముపై ప్రాణమిచ్చు సారంధ నేడు సాధారణ స్త్రీల విధమున శక్తిహీనురాలయ్యెను.

చంపత్ రాయ:—సారణ్, చూడుము. మన వీరుడొకడు మృత్యుముఖమున బడినాడు, ఏ ఆపత్తి మనభయమునకు కారణమగుచుండెనో నేడది రానేవచ్చెను. నాకన్నులయెదుట నేశత్రువులు నీకోమలశరీరము నంటుదురుగదా! మరియు నాకు కదులుటకైనను శక్తిలేదు. హా! ఓ మృత్యుదేవతా! నీవుదన్నెప్పు డాహ్వానించెదవు" ఇంతలో నతని కొక తలంపుగలిగెను. కత్తివైపు చేయిజాచెను కాని చేతిలో బలములేకుండెను. సారంధతో, "ప్రేయసీ, నీవెన్ని యోసమయములందు నాగౌరవము నిలిపియుంటివి."

ఈమాటలు వినగనే వాడిపోయిన సారంధ ముఖముపైఎరుపు రాజొచ్చెను. ఈ అంతిమదశయందుగూడ నేను నాపతిసేవ జేయగలుగుదునుగదా యను నాశ నామెనుశక్తివంతనుగా నొనర్చెను. ఆమె రాజువైపు విశ్వాసోత్పాదక భావములతో జూచి యనెను, "దేవునియనుగ్రహ మున్న నా జీవితమున్నంతవరకు మీ గౌరవము నిల్చును."

రాజు, తన ప్రాణముల గోరుచున్నాడని రాణి తలంచెను.

చంపత్:—నీ వెప్పుడును నామాటనుండి దొలగకుంటివి.

రాణి:—ప్రాణము లున్నంతవరకు దొలగను.

చంపత్: ...ఇది నా యంతిమ కోరిక. నీవు నిరాకరించకుము.

సారంధ తన వక్షస్థలముపై కత్తినునిచి, "ఇందు మీయాజ్ఞలేదు, కాని నా హార్దికయభిలాష గలదు. చచ్చినను నాశీర్షము మీపాదములపై నుండగలెను."

చంపత్:—నీవుగ్రహించలేదు. ఏమి, నేను బేడీలుపెట్టుకొని డిల్లీబాజారులలో నిందాపాత్రుడిగా తిరుగుటకేనా నన్ను నీవు వదలిపోవుట?

రాణిజి జ్ఞానదృష్టితో రాజువైపుజూచెను—ఆమెయింకను రాజుపలుకుమాటలు గ్రహించలేదు—

రాజు:—నేను నీ నొక్క వరదానము గోరెద.

రాణి:—సహర్షముగా—

రాజు:—ఇదినా అంతిమప్రార్థన! నే నేదిగోరిన నదియిచ్చెదవా?

రాణి:—తప్పక

రాజు:—మాటను, వచనమిచ్చితివి, దొలగకుము సుమా?

రాణి:—(వణకుచు) మీయాజ్ఞయేమి ఆలస్యము.

రాజు:—నీఖడ్గముతో నా వక్షస్థలమును ఛేదించుము.

రాణి హృదయమునందు బాణముదగిలినటులయ్యెను, "జీవననాథా!" అనియింతమాటాడకపోయెను.

రాజు:—నేను బేడీలుదొడుగుకొనుటకు జీవింపనొల్లను.

రాణి:—దీని నేనెట్లొనర్తు?

అయిదవయరియు అంతిమయోధుడు భూమిపైపడెను. బాదుషాసైనికులు రాజువైపువచ్చుచుండిరి. రాజునిరాశాపూర్ణభావములతో రాణివైపుజూచెను. రాణి క్షణమువరకనిశ్చిత రూపముతో నిలబడెను. కాని సంకటసమయమందు మనవిశ్చయాత్మక శక్తిబలపడును బాదుషాసైనికులు రాజునుసమీపించి పట్టుకొననుండిరికాని రాణి సారంధతివేగముతో తనఖడ్గముతో రాజు హృదయమునుబొడిచెను.

ప్రేమనావ ప్రేమసాగరమందుమునిగెను. రాజు హృదయమునుండి రుధిరధార ప్రవహించుచుండెను కాని ముఖముపై శాంతిచిహ్నములు గోచరించుచుండెను.

ఎంతకరుణామయదృశ్యము. ఏ స్త్రీతనపతిని ప్రాణములకన్న మిక్కుటముగా ప్రేమించుచుండెనో నేడా స్త్రీ యతని ప్రాణఘాతకురాలుగా మారెను. ఏహృదయము నాలింగన మొనర్చియామె వనసుఖములనుభవించెనో, ఏహృదయమందామె యభిలాషలు కేంద్రీకరింపబడియుండెనో, ఏ హృదయమామెయభిమానమును పోషించుచుండెనో, అహృదయము నే నేడు సారంధఖడ్గము ఛేదింపుచున్నది, ఏ స్త్రీ ఖడ్గమీకార్య మొనర్చెను.

ఆహా, ఆత్మాభిమానముయొక్క అంతిమెంతవిషాదముగానున్నది. ఈవిధమైన ఆత్మగౌరవ దృశ్యము చందమపూర్ మరియు మార్వాడ్ దేశచరిత్రములందుగూడ కనిపించదు.

బాదుషాసిపాహీలు సారంధయొక్క సాహసము మరియు ధైర్యముజూచి ఆశ్చర్యపడిరి సర్దారుముందుకరిగియనెను, "రాణిసాహెబా! దేవునిసాక్ష్యం, మేమందరము మీసేవకులము మీ జోసైనయాజ్ఞయున్న హృదయపూర్వకముగా నొనర్చెదము సారంధ, సర్దారుతో, "మా పుత్రులలో నెవరైన బ్రతికియున్నచో నీరెండుశవములనతనికందజేయుడ"ని నుడువుచు నదేఖడ్గముతో తనహృదయముఛేదించుకొనెను. ఆచేతురాలై క్రిందపడెను. కాని ఆమెశిర్షము చంపత్ రాయహృదయముపైనుండెను.

సంపూర్ణము

